Regd No. N. 40 M. 3813

వెల ఒక అణా

102872




ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

★ స్పెయిను, తుర్కీ, రష్యాలలో జర్మనీ ఎత్తులు ★

★ రుమేనియాలో మరల ఈగడబిడ భయము

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర చైత్ర బ॥ ౧౩ (౨౦-౭-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౬౭

# యుగోస్లావియా రాజు దేశం వదలెను

## యుగోస్లావియా పంపకాన్ని గూర్చి జర్మనీ, ఇటలీల ఆలోచన

### గ్రీసులో బ్రిటిషు సేనలు మరికొన్ని స్థానాలు వదలిపోవుట

### జర్మను సేనలకు గొప్ప నష్టములు

యుగోస్లావియా సేనలు జర్మనులకు లొంగిపోయినట్లే తేలుచున్నవి. ఇపుడు అక్కడినుండి యుద్ధవార్తలే వచ్చుటలేదు. పైగా యుగోస్లావియా ప్రధానియగు జనరల్ సిమోవిచ్‌గారు ఏప్రిలు ౧౯ వ తేదీన గ్రీసు ప్రధాననగరము ఏథెన్సునుండి చేసిన ఒక ప్రకటనలో "తుదిఫలితమును గూర్చి మా ప్రజలకు ఎట్టి భ్రమలుగాని ఉండలేదు, అంతబలవంతుడగు శత్రువును జయించుట కష్టమని ఎరిగియుంటిమి. మా ప్రజలు స్వాతంత్ర్యమును రక్షించవలసిన సమయము వచ్చినపుడు ఎటువంటివానితోనైన యుద్ధమునకు ఒప్పుకొనవలెనని ఎరుగుదురు" అని చెప్పినారు. మా యుగోస్లావియా సేన సరిగా సిద్ధపరచబడియుండలేదనియు, యుగోస్లావియా మిత్రులు కూడ వేగముగా సహాయము చేయలేకపోయిరనియు, తూర్పు సెర్బియా ప్రాంతమును వదలివేసి, మరియొకచోటనుండి పోరాటము సాగించవచ్చునని తలంచియుండగా, జాగ్రెబ్ జర్మనులకు దక్కిన తర్వాత క్రోడియా రాష్ట్రము యుగోస్లావియానుండి జర్మనులచే విడదీయబడుటచేత ఆ కోరిక కూడ విఫలమైనదనియు సిమోవిచ్‌గారు చెప్పినారు.

### గ్రీసులో యుద్ధము

ఇక మిగిలినది గ్రీసులో యుద్ధము. ఇక్కడ ఉత్తర గ్రీసులో జర్మను సేనల ఒత్తిడి ఎక్కువకాగా బ్రిటిషు సామ్రాజ్య సేనలును గ్రీకు సేనలును తామున్న ప్రదేశాన్ని ఖాళీచేసి వేరే ప్రదేశానికి పోయినవి, ఒలింపస్ పర్వతమునుండి ఆల్బేనియాలోని హిమారా ప్రాంతమువరకు ౧౫౦ మైళ్ళ దూరము బ్రిటిషు సామ్రాజ్య సేనలును విస్తరించి నిలిచి థెస్సలీ వైపు పోవుచున్న జర్మను సేనలను ముందుకు సాగనీయకుండ ఒకటి రెండు రోజులు ఆపినవి. ఈ ౧౫౦ మైళ్ళ రంగంలో సాగస్తా పెరాస్ ఆకొండల మధ్య కనుమవద్ద బ్రిటిషు సేనలు జర్మనుల పత్నిదళములను. కొల్చలమును వెనుకకు తిరిగి చేసినవి ఒలింపస్ పర్వతమును బ్రిటిషు సామ్రాజ్యములోని ఆస్ట్రేలియాకు సంబంధించిన సేనలు రక్షించుచు జర్మను సేనలు ముందుకు సాగనీయకుండ ఒకటి రెండు రోజులాపినవి. తర్వాత కలాబక చేసుచోటికి ఉత్తరమున (ఇది ఈ రంగము మధ్యంలో నున్నది) గ్రీకుసేనలుండెను. అవి జర్మనుల ఒత్తిడిని భరించజాలక పోవుచుండెను. ఈ మూడు స్థానములవద్ద జర్మను సేనలలో ౭౦౦౦౦ మంది మరణించిరని గ్రీకు చెప్పినారు. ఇవన్నియు ఏప్రిలు ౧౭ తేదీనాటివార్తలు.

ఏప్రిలు ౧౮ వ తేదీనాటి వార్తలలో కలంబకకు ఉత్తరమున గ్రీవెనావద్ద గ్రీకులు తాము శ్రమపడి గొట్టుకొనియుండిన ప్రదేశమును తిరిగి రాబట్టుకొనుటకై ఘోరముగ పోరాడి జర్మను సేనలను వెనుకకు తరుముగొట్టిరని వచ్చిన ఒకటి మాత్రమే గ్రీకులకు సంతోషకరమైన వార్త. జర్మనులు ఈ దెబ్బలో చాల నష్టపడిరట. అయినను జర్మను సేనలను గ్రీకులాపి ముందుకు పోవుటమాన లేదు.

అందుచే ఏప్రిలు ౨౦ వ తేదీనాటికి బ్రిటిషు సేనలు ఒలింపస్ పర్వతప్రదేశమును వదలిపోయినవని వార్త వచ్చినది. తర్వాత జర్మను సేనలువచ్చి ఆప్రదేశములో చేరినవి.

### బల్గేరియా సేనలు

ఇవి గ్రీకు యుద్ధ వార్తలు. ఇక బల్గేరియా వారికి ప్రస్తుతమునకు మాసడోనియాలోను, థ్రేసులోను సరిహద్దులు ఏర్పరచుకొనుటకు జర్మనులు అంగీకరించినారు. ఇప్పుడు బల్గేరియా సేనలు పశ్చిమ థ్రేసులో కవడచు పోయి బల్గేరియా సరిహద్దునందలి స్వెలెగ్రాండునుండి దక్షిణంగా ఈజియన్ సముద్రంలో డెడగాచ్ వరకు గీతగీయుచో అది యెక్కడ ఉండునో అక్కడ అగును. క్రొత్త గా ఏర్పడే తూర్పు సరిహద్దు. పడమట క్రొత్త సరిహద్దు స్ట్రూమా నదియగును. మాసిడోనియాలో వర్దార్ నదివరకు బల్గేరియా సేనలు పోయి ఆక్రమించుకొనును. దక్షిణములో పూర్వము గ్రీకు తుర్కీల మధ్య సరిహద్దు ఎక్కడనుండెనో అంతవరకు పోవును. ఈ రంగంలో బల్గేరియా సేనలు మొరావా నదివరకు పోవును ఈ క్రొత్త సరిహద్దులు తాత్కాలికములేనట.

### విమానాల దాడులు

ఇక విమానాల దాడుల సంగతి. బ్రిటిషువారు ౫౫ జర్మను విమానాలను క్రిందకి కూల్చిరని ఏప్రిలు ౧౫ వ తేదీనాటి వార్త. గ్రీసులో నేలపై పోరాడుచున్న సేనలకు సహాయముగా బ్రిటిషు విమానములు ౧౫ వ తేదీన శత్రుసేనపైని బాంబులు వేసినవి. ఏప్రిలు ౧౪ వ, ౧౫ వ, ౧౬ వ తేదులలో బ్రిటిషు విమానాలు గ్రీసులో మొత్తము ౧౫ జర్మను విమానములను క్రిందకూల్చినవి.

ఏప్రిలు ౧౫ వ తేదీన జర్మను విమానాలు గ్రీసులో అనేకములైన చరిత్రప్రసిద్ధ పట్టణములపై బాంబులను వేసినవట. గ్రామాలపై ఆ విమానాలలోని వారు మరతుపాకులను ప్రేల్చిరట. ఇదే రోజు జర్మను విమానాలు పిరయూసుపైనను, ఏథెన్సు నగరముపైనను కూడ బాంబులను వేసినవి. ౧౬ వ తేదీన జర్మను విమానాలు బ్రిటిషు సేనలమీదికిని, ఖాల్కిసువద్ద బ్రిటిషు ఓడలపైకిని బాంబులను వేయగా బ్రిటిషు విమానాలు వాటితో పోరాడి పదింటిని క్రిందకూల్చినవి. అనేక జర్మను విమానాలు చెడగొట్టబడినవి.

ఏప్రిలు ౧౭ వ తేదీన బ్రిటిషు విమానాలు గ్రీసులో ౧౫ జర్మను విమానాలను క్రిందకూల్చినవి. ఇంకను అనేకములు పాడుచేయబడినవి. బ్రిటిషు విమానాలు ఏవీ స్వస్థానాలకు తిరిగిరాలేదు. కొన్ని బ్రిటిషు విమానాశ్రయములకు జర్మను విమానాలచే కొంత నష్టము కలిగించబడెను. బ్రిటిషు విమానాలు జర్మనుల విమానాశ్రయాలమీదను, సేనల మీదను బాంబులను వేసినవి.

జర్మను విమానాలు మిరలోని ఫిరేవుసు రేవు దగ్గర రవాణా చేయుచుండిన రెండు ఓడలపై బాంబులను వేసినవి. ఈ ఓడలలో యుద్ధంలో గాయపడిన సైనికులు చికిత్సకై తీసికొని పోబడుచుండిరి. తుదకు ఆ ఓడలు యుద్ధక్షేతులకు ఎట్టి దెబ్బలుగాని తగులకుండ రేవుకు చేర్చబడిరట!

### ఆల్బేనియాలో యుద్ధము

ఆల్బేనియా యుద్ధంలో కూడ గ్రీకు సేనలు ఇంతవరకున్న స్థలాలను వదలి వెనుకకు పోవుచున్నవి. ఏప్రిలు ౧౫ వ తేదీన రెండుతావులలో ఇటాలీయను సేనలు గ్రీకు సేనలనెదిరించగా గ్రీకు సేనలు శత్రుసేనలను తరిమివేసినవి.

### గ్రీసు ప్రధాని ఆత్మహత్య

గ్రీసుప్రధాని కొరిజిస్ గారు మరణించిరని గత సంచికలో వార్త ప్రకటించియుంటిమి. ఆయన యుద్ధములో గ్రీసుయొక్క ముందుగతి ఎట్లుతేలునో యను ఆందోళనచే ఆత్మహత్య గావించుకొనినట్లు ఇపుడు తెలియుచున్నది.

### క్రొత్త మంత్రివర్గము

ఈవిధముగ ప్రధాని చనిపోవుటచే క్రొత్త మంత్రివర్గము ఏర్పాటు చేయవలసివచ్చినది. ఇందులో గ్రీసు రాజుగారే ప్రధాన మంత్రిగా నుండుటకు నిశ్చయించినారు. ఉపప్రధానిగ వైస్ అడ్మిరల్ అలెగ్జాండర్ సాకెల్లారియో గారు నియుక్తులైనారు. మరి నలుగురు మంత్రులందరును సైనికాధికారులే. వీరుగాక మరిఇరుగురు మంత్రులు ఆ మంత్రివర్గంలో గలరు.

### గ్రీసు రాజుగారి ప్రకటన

ఏప్రిలు ౧౯ వ తేదీన గ్రీకురాజుగారు గావించిన ఒక ప్రకటనలో ప్రస్తుతమునకు మంత్రివర్గవ్యవహారములను తానే స్వయముగా నడిపించుకొనుటకు నిశ్చయించుకొంటిమని చెప్పి సైనికులును ప్రజలును ఏమాత్రము బెదరుకొనక ప్రశాంతంగానుండి తమ దేశగౌరవ, స్వాతంత్ర్యముకొరకై విజయము కలుగువరకు పోరాడవలెనని చెప్పిరి.

### ఇప్పుడే తెలిసిన సమాచారము

పైసమాచారాలు వ్రాసిన తర్వాత గ్రీసు, యుగోస్లావియాలను గురించి మరికొన్ని సంగతులు తెలిసినవి. గ్రీసులో బ్రిటిషు సామ్రాజ్య సేనలు లారిస్సా, త్రిక్కల అను స్థానాలను కూడ ఖాళీచేసిపోయినవి. జర్మనులు ఇంకను ముందుకు నెట్టుకొని వచ్చినారు.

### యుగోస్లావు రాజు పరారి

యుగోస్లావియా బాలరాజు అగు పీటర్ గారు తమమంత్రులతో గూడ యుగోస్లావియా వదలి గ్రీసుకును, అక్కడినుండి పాలెస్టైనులో జెరుసెలమునకును చేరినారు గ్రీసునుండి జెరుసెలమునకు విమానంలో పోవుచుండగా జర్మనులు మధ్యధరా సముద్రంమీద ఆవిమానంపై బాంబులు వేయుటచే అందులోని ఒక మంత్రి మరణించెను. పీటరుగారి మంత్రివర్గంలో క్రోటుజాతివారల పక్షంలో నుండిన మంత్రిమాత్రము క్రొత్తగా జర్మను ఏర్పరచిన క్రోషియాలోనే నిలచిపోయినాడు.

### జర్మనీ, ఇటలీల పంపకపు ఆలోచనలు

జర్మనీ విదేశాంగమంత్రి రిబ్బెంట్రాప్ గారును, ఇటాలీ విదేశాంగమంత్రి కౌంట్ సియానో గారును అప్పుడే వియన్నాలో చేరి యుగోస్లావియాను ఎట్లు పంచుకోవలెనని ఆలోచనలు ప్రారంభించినారు. ఈ ఆలోచనలు ఏప్రిలు ౨౧, ౨౨ వ తేదులలో పూర్తి కావచ్చును. ఇటలీవారు డాల్మేషియా సముద్రతీరాన్ని కోరుచున్నారు. ఇరువదియేండ్లనుంచి వారలు దీనిని కోరుచునే యుండిరి. డాన్యూబు నదివద్దనుండు ఐరన్‌గేటును సర్బియానుండి విడదీసి వేరే చేయుటకై రుమేనియావారు సూచించుచున్నారట.

### రుమేనియాలో మరల గడబిడభయము

రుమేనియాలో మరల గడబిడలు జరుగునేమో యనే భయము కనపడుచున్నది. ఆ రాజ్య ప్రధానియగు జనరల్ ఆంటొనెస్కు గారు హోరియా సిమా అను ఐరన్ గార్డునాయకుడు చేసెదనన్న సహకారమును నిరాకరించుటయేగాక, అంతకంతకు హోరియాసిమా ఐరన్ గార్డు పార్టీలోనివారలను ఉరితీయుటకాజ్ఞ చేయుచున్నారట. హంగరీ, రుమేనియాల మధ్య సరిహద్దు కొన్ని జిల్లాలలో మూతవేయబడినవి. ఆంటొనెస్కు గారి ప్రభుత్వమునకు విరుద్ధప్రచారము చేయు కరపత్రములు ప్రకటించకుండ నిరోధించుటకై ఇపుడు ఆరాజ్యంలో ఉండే అచ్చుయంత్రాలన్నియు రిజిస్టరు చేయింపవలసినట్లు ఆంటొనెస్కు గారు ఆజ్ఞ చేసినారు.

### స్పెయిను, తుర్కీ, రష్యాలలో జర్మనుల ఎత్తులు

ఇపుడు జర్మనులు ఫ్రాన్సును, స్పెయినును, తుర్కీనికూడ సహకారము చేయునట్లు చేయుటకై ఎన్ని యోయుక్తులు చేయుచున్నట్లు కనపడుచున్నది. తుర్కీ సహాయం చిక్కిందంటే యూరపుఖండం ప్రక్కనఉన్నకొని ఉండే తూర్పుదేశాలలోని పెట్రోలు, కిరసనాయిలు గనులను వశపరచుకొనుటకై పోవుటకు జర్మనులకు మార్గము చిక్కును. రష్యానుండి మరికొన్ని ఆర్థిక సౌకర్యాలను పొందుటకై జర్మనులు క్రొత్త ఎత్తు వేయుచున్నట్లున్నది.

---

## ఆఫ్రికాలో యుద్ధము

ఏప్రిలు ౧౫ వ తేదీనుండి ౧౯ వ తేదీవరకు వచ్చిన ఆఫ్రికా యుద్ధవార్తలలో విశేషములేవియు లేవు. ౧౫, ౧౬ వ తేదులలో లిబియారంగంలో టోబ్రుకువద్దను, సోలుంవద్దను బ్రిటిషువారి పహరా సేనలు జర్మను సేనలకు చీకాకు కలిగించుచుండెను. ౧౬ వ తేదీన సోలుంవద్ద మాత్రమే ఇట్టిది జరిగెను. నిజమో అబద్ధమో కాని, అమెరికా నుండి వచ్చిన ఒక వార్తలో టోబ్రుకు వెలుపల ఇటాలీయులపై జర్మనుల శతఘ్నులు ప్రయోగించబడినవని యున్నది.

అబిసీనియారంగంలో బ్రిటిషు సేనలు డెస్సీ సమీపంలో చేరి అక్కడి ఇటాలీయులతో పోరాడుచున్నవి. ఇంకను అనేకులు ఇటాలీయ సైనికులు బ్రిటిషువారిచే ఖైదు చేయబడినారు.

అబిసీనియాలో ఇటాలీయ వైస్రాయి యగు అయోస్టా డ్యూకుగారు ఇటాలీయ సేనలు ఆయుధములను వదలి బ్రిటిషువారికి లొంగినచో బ్రిటిషువారు అబిసీనియాలోని తెల్లజాతివారల సంరక్షణను బాధ్యతవహించెదరని బ్రిటిషు సేనాధిపతియగు కనింగుహాంగారు చెప్పిన జవాబుకు ఒప్పుకొనలేదు. ఇటాలీయ సేనలు తుదివరకు పోరాడగలవని వారు తెలిపినారు.

ఇక విమానాల దాడుల సంగతి. బ్రిటిషు విమానాలును, ఆస్ట్రేలియా విమానాలును ఏప్రిలు ౧౭ వ తేదీనను, ౧౫ వ తేదీనను సిరినైకాలో శత్రువుల మోటారులపైనను, సేనలపైనను, సామగ్రులపైనను బాంబులను వేసి చాల నష్టము కలిగించినవి. ౧౭ వ తేదీన డెర్నాలో విమానాశ్రయంమీదకూడ బాంబులు వేయబడినవి. దక్షిణాఫ్రికావారి విమానాలు కొంబోల్చా విమానాశ్రయముపై బాంబులు వేయుటచే ఏప్రిలు ౧౫ వ తేదీన అక్కడ ౬ ఇటాలీయ విమానాలు నాశనమైనవి మరొక ఇటాలీయ విమానాశ్రయంలో ఇంకొక విమానము ఈ దాడులలోనే పాడుచేయబడినది. ఈ దాడులనుండి ఒక్క బ్రిటిషు విమానము తిరిగిరాలేదు.

బ్రిటిషు ప్రభుత్వమువారు ఏప్రిలు ౧౫ వ తేదీన జర్మనీకి ఒక బెదరింపు చేసినారు. గ్రీసు ప్రధాన నగరము ఏథెన్సుమీదను, ఈజిప్టు ప్రధాననగరమగు కైరోమీదను శత్రువులు బాంబులను వేసినచో, ఇటలీ ప్రధాననగరమగు రోమ్ మీద తాము బాంబులను వేసి ప్రతిక్రియ చేసెదమని ఆ ప్రకటనలో బెదరించబడినది.

---

## అమెరికాకు బ్రిటిష్ మంత్రి విజ్ఞాపన

### చాలక్లిష్టపరిస్థితి వచ్చెననుట

ఏప్రిలు ౧౫ వ తేదీన అమెరికా మహాజనసభలో నుపన్యసించుచు యుద్ధము అట్లాంటిక్ లో తేలవలసిన స్థితి వచ్చెనని బ్రిటిషు మంత్రి లార్డ్ హాలిఫాక్స్ బట్లరు గారు ప్రకటించిరి. బ్రిటిషు ప్రజల స్వాతంత్ర్యానురక్తి మిక్కుటము, అమెరికా ప్రజలుగూడ బ్రిటిషు ప్రజలతో సమానముగ స్వాతంత్ర్యానురక్తి ప్రకటించుచో శత్రువు ఎంత చేసినను మనము భయపడవలసిన అవసరము లేదు. శత్రువు కంటె మనము ద్విగుణీకృతముగా ప్రయత్నించినగాని మనము నిలువజాలము. ఇప్పుడు సముద్రము మీద అత్యంత క్లిష్టమగు స్థితి యేర్పడినది. జర్మనులు యిప్పుడు మనలను ఓడింపనిచో ఎప్పుడూ ఓడింపజాలరు అని బట్లరు గారు ప్రకటించిరి. త్వరలో అమెరికానుండి బ్రిటిషు వారికి విస్తారముగా నౌకలు బయలుదేరునట్లు యని బట్లరు గారు తలంచిరి, ఓడలు విశేషముగా బయలుదేరనిచో అరువిచ్చుట, కవులిచ్చుట మాటమాత్రమే అని ఆయన చెప్పెను.

---

# అఖిలభారత వర్షీయ శ్రీ భట్ట బ్రాహ్మణ మహాసభ

(విశేషరి) మూసీ (కొత్తపేట)
ఏప్రిలు ౧౩.

ఏప్రిలు౧౧వతేదీ భదోహీస్టేషనునుండి శృంగారింపబడిన మూడుఏనుగులు ఆయిదు మోటారు కారులు కొన్నిగుర్రపుబండ్లు దాదాపువెయ్యిమంది ప్రేక్షకులుగల నాయకుల ఊరేగింపు అతివైభవముతో మూశీనగరము చేరెను. అచ్చటినుండి గొప్ప బేరాతో మధ్యమంటపము చుట్టు చిన్నచిన్న రావుటీలతో ప్రతినిధులవసతులు వానిచుట్టు నాగ కట్టుచే ప్రాకారము ఉన్నతమహాద్వారముతో నిర్మింపబడిన సభానగరము ప్రవేశించెను.

నాటిదినము సభాసదులకు నాయకుల పరిచయము చేయబడి ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత పండిత రామరామశివకుభట్టుగారి ఉపన్యాసము జరుపబడెను. అన్నిప్రాంతములవారిచే మాననీయ పండిత బచ్చునారాయణ బీ. రామ బి.ఏ. డిప్టిమేజిస్ట్రీటు (బీహారు)గారు మహాసభాధ్యక్షులుగా ఎన్నుకొబడిరి. వారిఅభిభాషణానంతరము కార్యదర్శిరిపోర్టు వినిపింపబడెను. అపిమ్మట సభాసదులనుండి విషయనిర్ణయసభ ఎన్నికలుజరిగి ఏబదిరెండుగురు సభ్యులుగా ఎన్నుకొబడిరి నాటిరాత్రి మరునాటియుదయమున విషయనిర్ణయసభ వాదోపవాదములతో జరుపబడెను.

మహాసభ ప్రథమద్వితీయ సమావేశము ౧౩వతేదీవరకు సాగెను. నాయకుల ఉపన్యాసములు వినుట సభ్యులహృదయములను నాకర్షించుచుండెను. తీర్మానములయందు అభిప్రాయములిచ్చు సభాసదులకు విమర్శగా అన్నివిషయములు తెలిపికొనుటకు మంచిఅవకాశము కలిగియుండెను మహాసభయందు నీదిగువతీర్మానము లంగీకరింపబడెను.

౧ జాతీయవిషయములు గ్రంథములు ప్రచురించుటకు సాహిత్యసుధాకరులను జాతీయపత్రిక క్రమపద్ధతిగా నడుపుటకు పదివేల రూపాయీల అంచనాతో జాతీయప్రెస్సు యొకటి అజ్మీరు (బ్రహ్మణపురము)నందు నెలకొల్పవలయును.

౨ కాశీనగరమందలి మూశీనగరమున స్వజాతిబాలురవిద్యాభివృద్ధికి యొకసంస్కృత పాఠశాల నెలకొల్పవలయును.

౩ బాల్యవివాహము క్రమక్రమముగా నిషేధింపవలయును.

౪ జాతీయాభివృద్ధికి తగుసదుపాయము లొనగూర్చుటకు మహారాజులనుండి ధనమార్జించుటకు [illegible] (రాయచూరి) వెళ్లవలయును.

౫ ప్రాంతీయస్థానములందని ప్రాంతములయందు ప్రత్యేకముగా ప్రాంతీయసభలు అతిత్వరలో నెలకొల్పవలయును.

పైవిషయములను గురించిన మరికొన్నిచిన్న చిన్నతీర్మానము లుపపాదింపబడెను. మరియు మహాసభనియమావళి ఉపసంఘమువారి మార్పులతో అంగీకరింపబడెను. పండిత జయనాథశర్మ అలీగడ్ డిప్టీకలెక్టరుగారి ఆకాలమరణమునుగురించి వారికుటుంబమునకు సానుభూతితీర్మానమొకటిగావింపబడెను. కడపట రాబోవుసంవత్సరపు ఎన్నికలుజరిగెను. మహాసభకార్యము హిందీభాషలో జరుగుచుండెను.

అమ్మహాసభామంటపమున యూ. పీ. ప్రాంతీయభట్టబ్రాహ్మణమహాసభ డేరాదూన్ నివాసులగు శ్రీయుత పండిత గుల్జారీలాలు భట్టు రతనుగారి అధ్యక్షతక్రింద ౧౨వతేదీ అతివైభవముగాజరిగి అందులోకొన్ని అవసరతీర్మానములు నియమావళిఅంగీకరింపబడెను.

౧౨వతేదీ రాత్రి సభామంటపమునందే కవిసమ్మేళనము రేవాస్టేటు రాజకవియగు శ్రీయుత పండిత అంబికేశుగారి అధ్యక్షతక్రింద మిక్కిలి శ్లాఘనీయముగాజరిగెను. అనేకదేశములనుండి, కవులు, పండితులుపాల్గొనియుండిరి. సంస్కృతభాషలో వ్యాఖ్యానములుజరిగెను–అవిఅతిసుందరముగా భావగర్భితములు ఉపదేశరూపములునై సభాసదులనాకర్షించుచుండెను. సమస్యలు చమత్కారముగా పూరింపబడుచుండెను.

౧౩వతేదీఉదయము యువకమహాసభయొకటి యామంటపమునందే శ్రీయుత జగతిరాం పండిత్ శార్ఎట్లాగారి అధ్యక్షతక్రింద సమావేశమైయుండెను యువకులఉత్సాహ మతి యుచ్ఛస్థితిలో గనబడుచుండెను.

యూ. పి., సీ. పి. బెంగాలు, పంజాబు, గుజరాతు. బీహారుప్రతినిధులు అధికముగావిచ్చేసియుండిరి. ఆంధ్రదేశమునుండి శ్రీయుత పండిత చక్రహరి, నరసిరాజు హైకోర్టువకీలుగారును పాల్గొనియుండిరి. ఇట్లుప్రతినిధులసంఖ్య నాలుగు వందలవరకుయుండినది. ప్రేక్షకులు ఇతరజాతీయ సమూహము ఇంచుమించు సభామంటపమునందు మూడువేలమందివరకు గనబడుచుండెను. గుజరాతు లాహోరు, కాన్పూరునుండి పత్రికాప్రతినిధులువిచ్చేసియుండిరి. బెంగాలు పత్రికాప్రతినిధికూడాయున్నట్లగుపడుచుండెను.

మూడురోజులసమావేశములను నందలికార్యక్రమమునుబట్టి యూహించినఅతిత్వరలోనే నీమహాసభ ఉన్నతస్థితికిరాగలదని పండితులభిప్రాయపడుచుండిరి.

# ఆంధ్రదేశ సత్యాగ్రహము

## మొత్తంసత్యాగ్రహులు ౧౮౬౭, జుల్మానాలు లక్షరూపాయలు

(స్వకీయవిశేషరి)

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు శ్రీమంతెన వెంకట్రాజు గారు ౫-౪-౪౧ తో అంతమగునెలకు సత్యాగ్రహోద్యమపుతీరుదిరిపోర్టును ప్రకటించుచున్నారు

కార్యనిర్వహణము

ఈనెలలోసత్యాగ్రహముచాలప్రోత్సాహకరముగవుండెను. రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షుడు డాక్టరుపట్టాభిసీతారామయ్యాగారు దేశరక్షణనిబంధనల ౨౬వ శిక్షనుక్రింద డిటెన్యూగ పట్టుకొనబడిరి. రాష్ట్రకాంగ్రెసుసంఘకార్యదర్శి శ్రీకళావెంకటరావు M. L. A. గారుకూడ అరెస్టుచేయబడి ఆరునెలలశిక్షవిధింపబడిరి. యింతవరకు రాష్ట్రకాంగ్రెసుసంఘసంయుక్త కార్యదర్శిగవుంటున్న శ్రీమంతెనవెంకట్రాజు గారు రాష్ట్రకాంగ్రెసుకార్య నిర్వహణకు నియమించబడిరి వారుఈనెల౨౦ వ తేదినఛార్జీదీసుకొనిరి

శిక్షలు

ఈనెలలో ౪౪౪మందిసత్యాగ్రహమొనర్చిరి. ఎందులో ౧౭౯మందిని అరెస్టుచేసిరి ౩౦౫మంది విడిచిపెట్టబడిరి అరెస్టుఅయిన ౧౭౯మందిలో ౧౬౧మంది దేశరక్షణనిబంధనక్రింగను రామంది న్యూసెన్సు ఆక్టు క్రిందశిక్షింపబడిరి. యిందులో ౧౫మంది విచారణకొరకు రిమాండునందుంచబడిరి. ౨౭గురిని అరెస్టుచేసి విడచిపెట్టిరి. మొత్తం ఈ నెలలోశిక్షింపబడిన వారిలో ౯గురిని (ఏ)క్లాసునందు ౧౫౫ని (బి)క్లాసునందు మిగిలినవారి గురిని (సి) క్లాసునందుంచిరి.

సత్యాగ్రహ ప్రారంభము నుండి యింతవరకు ఆంధ్రదేశమున సత్యాగ్రహమొనర్చిన వారిసంఖ్య ౧౮౬౭. ఈనెలలోశిక్షలు రెండుతరాలు జుర్మానాగాని కోర్టుముగియువరకు శిక్షగాని మొదలువెయ్యిరూపాయల జుర్మానాగాని మరి నిమిదినెలలశిక్షవరకు జావుంటూవచ్చినవి

జుల్మానాలు

ఈనెలలోసత్యాగ్రహులకు విధించినజుల్మానాల మొత్తం రూ౧౨౪౮౯-౦-౦ సత్యాగ్రహ ప్రారంభమునుండి యిప్పటివరకు ఆంధ్రదేశమున రూ౧౦౪౪౯-౨-౪-౯ జుల్మానాలువిధించబడినవి

సోదాలు

౯ నెలలోసోదాలువిరివిగజరిగెను. రాష్ట్రకాంగ్రెసుసంఘకార్యదర్శి శ్రీకళావెంకటరావుగారి అమలాపురం నివాసమును సోదాచేసిరి. ౧౮-౩-౪౧న రాష్ట్రకాంగ్రెసు సంఘకార్యాలయమును సోదాచేసికార్యాలయము తాళాలురెండుటైపురైటర్లు, ఒకసైక్లోస్టయిల్ మిషను తీసుకొనిపోయిరి. యింకనుకొన్ని రికార్డులుతీసుకొనిపోయిరి పశ్చిమగోదావరి, అనంతపురంజిల్లాకాంగ్రెసు కార్యాలయములనుకూడా ఈనెలలో సోదాచేసిరి. యింతేగాక శ్రీఎ. రాఘుప్పజిల్లాబోర్డుఅధ్యక్షులు, అనంతపురం శ్రీ హెచ్.నరసింగరావుగార్లయిండ్లనుకూడ సోదాచేసికొన్ని ఉత్తరములను తీసుకొనిపోయిరి.

జిల్లాఏజంట్లఅరెస్టులు

ఉత్తరవిశాఖపట్నం జిల్లాకాంగ్రెసుఏజెంటు శ్రీకాకూరు రామకృష్ణారావుగారుఅనంతపురం జిల్లాకాంగ్రెసు ఏజెంటుశ్రీఎ. రామప్పగారు ఈనెలలో అరెస్టుచేయబడిరి.

అరెస్టుకాని సత్యాగ్రహులు

ఆంధ్రదేశములో అరెస్టుకానిసత్యాగ్రహుల సంఖ్యజాస్తి అవుటవలనవారికినూతన కార్యక్రమముయివ్వవలసివచ్చినది. యిందునిమిత్తం యిందుకుగాను ఢిల్లీఅభిముఖులైన సత్యాగ్రహులనుపహిత్తం వారి వారి జిల్లా లకు తిరి పిలిపించిరి. మొట్టమొదట ఈనూతనకేంద్రీకృతసత్యాగ్రహకార్యక్రమము తూర్పుగోదావరి, గుంటూరు, అనంతపురంజిల్లాలలో ప్రారంభించబడినది. ౧౧౦మంది సత్యాగ్రహులు రామచంద్రపురం, ౪౪ తెనాలి ౧౦౫గురు మడకశిరతాలూకాలలోనూతనప్రత్యేకకార్యక్రమము ప్రకారం సత్యాగ్రహముచేసిరి. వీరుఆతాలూకాలోని ప్రతిగామముతిరిగి యుద్ధవ్యతిరేకకేకల వేయుచుతీవ్రముగ యుద్ధవ్యతిరేకప్రచారముచేయ మొదలిడిరి.

ఈకేంద్రీకృత కార్యక్రమముప్రారంభించబడినపిమ్మట రామచంద్రపురం తాలూకాలోని ౨౫గురుసత్యాగ్రహులు అరెస్టుచేయబడిరి. ఈ మూడుతాలూకాలలోనిపై ప్రత్యేకకార్యక్రమ ఫలితములు ప్రోత్సాహకరముగనున్నవి. ఈపద్ధతి యింకమూడుజిల్లాలకు త్వరలోవర్తింప చేయబడును.

సత్యాగ్రహ ఖయిదీలు ప్రభుత్వ వైఖరి

ఈకార్యాలయమునకువచ్చు నివేదికలనుబట్టిసత్యాగ్రహఖయిదీలపట్ల ప్రభుత్వవిధానమునందేట్టిమార్పున్నట్లు కనుపడదు.

మద్రాసుప్రభుత్వప్రకటన సత్యాగ్రహఖయిదీలకు బేడీలువేయనవసరములేదని, అన్నప్పటికి యింకనుకొన్నిచోట్ల రిపోర్టులువచ్చుచున్నవి. వైశ్యనుండి (సి) క్లాసుఖయిదీలస్థితి ఏమీబాగుండలేదని రిపోర్టులువచ్చుచున్నవి. యిట్టివిజరుగకూడదని, రాజకీయఖయిదీలపట్ల వైఖరినిమార్పుపజూందోళనము పత్రికలద్వారా జరుగుచునేయున్నది.

## సుభాష్‌బోసు యింటిలో ౪ వ భాగం జప్తు

కలకత్తాలో సుభాష్‌బోసుగారికిని వారిసోదరులకును చెందినయింటిలో నాల్గవభాగముప్రభుత్వమువారికి జప్తుఅయినట్లు ఒక ప్రభుత్వాజ్ఞ అయింటికి ప్రీవలు'గలావ తేదిన అతికించబడినది. త్వరలోఆజ్ఞ నెరవేర్చుటకు చర్యగైకొనబడగలదు.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర చైత్ర బ॥ ౧౩

గురువారము


## విద్యామహాసభా నిర్ణయములు

చతుర్థ విద్యాపరిషత్తువారు చేసిన తీర్మానములలో ముఖ్యమైనది ముల్కీ భాషలను గురించినట్టిది. మాతృభాషలలో విద్య ఉన్నతపాఠశాలల తుదివరకును చెప్పించవలెను అని తీర్మానించినారు. ఇది సమంజసముగానే ఉన్నది. హిందూబాలురకు ఒకటవ ఫారమునుండి ఉర్దూను నిర్బంధ ద్వితీయ భాషగా ఏర్పాటుచేయుట అదేవిధముగా ముస్లింబాలురకు జిల్లాభాష నిర్బంధద్వితీయభాషగా ఏర్పాటు చేయుట శిష్టమరాజనీతిగా ఉండును. హిందువులకు భూగోళమువంటి కొన్ని పాఠగ్రంథాలనుకూడ ఉర్దూలో చెప్పించవచ్చును. ఈప్రకారము చేసిన దేశభాషలకు ప్రోత్సాహము కలుగును. విద్యార్థులకువిద్య సులభముగా ఒంటబట్టును. ఇంతేకాక హిందువులలోకన్న మూడంతలు హెచ్చుగా మునల్మానులలో విద్యావ్యాపకమున్నదికదా అట్టి తారతమ్యముండక హిందువులు కూడా మునల్మానులవలె అక్షరాస్యులగుటకు మంచి అవకాశము లభించును.

ఇంకొక తీర్మానముద్వారా ఖాస్గీబళ్లకు ప్రభుత్వము ప్రోత్సాహముకలిగించి వాటికి సహాయముచేసి ఆకార్యములో పనిచేయు ప్రజాసేవకులను విశ్వసించి వారికి ప్రోత్సాహము కలిగించవలెనని నిర్ణయించినారు. ఇదేసమయములోనే మన పూజ్య ప్రధానామాత్యులవారు "ప్రజాసేవకులను తక్కువ దృష్టితో చూడకూడదు. వారివిలువను అధికారులు గుర్తించవలెను. వారిసహాయము లేనిది వహూకారోద్యమముకాని గ్రామపునర్నిర్మాణము కానిముందడుగు వేయనేరదు" అని సెలవిచ్చిరి. ఈభావమునే ఇంచుమించుగా విద్యామహాసభవారును ప్రకటించినారు. ఎప్పుడీ పరిస్థితి యేర్పడునో అప్పుడు ప్రజలనుండి విద్యాది ప్రజాభ్యుదయ కార్యములకు ద్రవ్యముదారముగా వినియోగ పరుపబడునని ఊహించుచున్నాము. ఇప్పుడు గ్రంథాలయములమీద పోలీసువారొక కన్ను ఉంచుట, ఖాస్గీబళ్ల వారిని పోలీసువారు బెదరించుట, సభలపై ఆంక్షలుపెట్టుట, దేశభాషలకు స్థానములేకపోవుట, ఇట్టివిప్రజలనుండి ప్రభుత్వాన్ని దూరదూరముగా భిన్నించుటకు సాధనము కాదగినవి. ఇవి తొలగిననాడు ప్రజలకును ప్రభుత్వానికిని "తల్లిపిల్ల" భావమేర్పడి దేశము అతిశీఘ్రముగా వృద్ధికి రాగలదు.

హిందీకిని స్థానముండవలె నని మరొక తీర్మానమేర్పడినది. ఆంధ్రమహారాష్ట్ర కర్ణాటకులకు హిందీ ఒక బెడ్డయౌక లే. ఈరెంటిలో హిందీలో సంస్కృతలిపి ఉన్నందునను హిందీలో సంస్కృతపదాలు హెచ్చుగా ఉన్నందునను పై మూడు భాషలవారికి ఉర్దూకన్న హిందీకి దగ్గరిసంబంధమేర్పడును. అంతే కాని రెండును దేశభాషలకు భిన్నించినవే. ఉర్దూను ౧౫ లక్షల మునల్మానులాదరింతురు హిందీని ౧౫ వేలమంది వరకు హిందూస్థానీ హిందువులు నిజాం రాష్ట్రములో ఉనికిచేసుకొని నిలిచిపోయిన వారాదరింతురు. అంతే.

ప్రభుత్వంవారు గ్రంథాలయాలను ప్రతితాలూకాలో ఏర్పాటు చేయవలెననిన్నీ అందు జిల్లాభాషాగ్రంథాలెక్కువగా ఉండవలెననిన్నీ అన్ని భాషలలోనుండు ముల్కీపత్రిక లందుండవలెనిన్నీ మరొక తీర్మానము కావింపబడినది. ఇది బాగానేయున్నది. అమలుజరిగే దెప్పుడనేదే మొదటిప్రశ్న తుది ప్రశ్న. మరి ఉర్దూపత్రికలనే ఉర్దూగ్రంథాలనే విశేషముగా ప్రభుత్వ పాఠశాలాదులలో కొనుచున్నారన్నమాట సత్యమే. ప్రభుత్వమువారు, దేశభాషలలో రాష్ట్రమందు ముద్రితమగు గ్రంథాలలో మంచివాటిని కొనుట చాలముఖ్యము. కాని ప్రతిమాధ్యమిక ఉన్నతపాఠశాలకు రెండురెండు ప్రతుల ప్రకారము పంపవలెను అయితే ఆవిధంగాచేసిన కొన్నివందల రూపాయీలు ఎక్కువగా ఖర్చగును నిజమే. అప్పుడు బయటికి—అనగా బ్రిటిషిండియా సంస్థలకును ఖండఖండాంతర సంస్థలకును ఇచ్చు వినాళాలను తగ్గించుకొనవచ్చును. తనకుమాలిన ధర్మమెక్కడనైనను ఉండగలదా?

గ్రంథాలయాలపై పోలీసువారు ఒక కన్నుపెట్టి యుండవలెనుసుమా అని ౧౯౨౯ ఫిబ్రవరి ౧౩ తేదీ ఫర్మాను ఒకటి ఆజ్ఞ చేసియుండిరట. దాని నుపసంహరించుకోండి అని మరొక తీర్మానంచేసినారు. ఈ గష్తీ ఉండినను అది అమలులో కానరాదు, అదున్నను వకటే లేకున్నను ఒకటే కాని అప్పుడప్పుడు అచ్చటచ్చట పోలీసు అమీనువంటి వారెవ్వరైనను దానినిస్మరించుకొని స్థానిక గ్రంథాలయములవారిని తమ ఠాణాకు రండి పోండి అని త్రిప్పుచున్నట్లు మాత్రము వినుచుందుము. ఈ కను అమీనులవంటి వారికిని గ్రంథాలయములవారికిని లేకుండ చేసిన చాలును.

జాగీరుదైతుల విద్యను విద్యాశాఖవారు తమ అధీనములోనికి తీసుకొనవలెనని తీర్మానించినారు. ఈభావాన్ని మొట్టమొదట ప్రచారములోనికి తెచ్చినది మాపత్రికయే యని చాలమంది యెరుగరు కాబోలును. సుమారు ౧౦ సంవత్సరములక్రిందట మేము ఈవమస్యపై సంపాదకీయము వ్రాసి అప్పటినుండియు ఎడతెగకుండ ప్రచారము చేయుచున్నాము. మరల యిప్పుడు నొక్కి చెప్పవలసిన అవసరముకానరాదు.

బయటి సంస్థలకుసహాయము, ఉస్మానియా విద్యాపీఠముపై అపారద్రవ్యము, విపరీతమైన అధికజీతాలు, వెంటనే తగ్గింపవలెనని మరొకతీర్మానము చేసినారు. ఇదిచాలా సమంజసము. మనకు బంగ్లాలు ప్రధానంకాదు. మనకు సరియగు విద్యనేర్పినవారే కావలెను. ప్రాచీనార్యులు చెట్లక్రిందనే గుడిసెలలోచదివి ప్రపంచము దిగ్భ్రమచెందునట్టి శాస్త్రములువ్రాసిరి. ఇప్పటి భారతీయులు లక్షలు కోట్లు విలువచేయు బంగ్లాలలో ఆధునికమైనన్ను సౌకర్యాలతో సౌఖ్యమనుభవించి చదివి ప్రపంచము నారుమెచ్చుకొను గ్రంథాలను వ్రాయుమని పదింటినైనను వ్రాయలేరు. జీతాలవిషయములో మేమిదివరకే ఆక్షేపించినాము వాటిని తగ్గించవలసినదే. ఇతరదేశాలలోని జీతాలను చూచిన మనకాశ్చర్యముకలుగును. ఈ బీదదేశములో ఇంతగొప్ప జీతాలిచ్చుటవలన లాభమునకు మారుగా నష్టమే కలిగినది.

ప్రజావిద్యామహాసభ చేసిన తీర్మానాలు సర్వమైనవిగా ఉన్నవి. బహుళసంఖ్యాకులైన లక్షల ప్రజల ఆమోదమును తప్పక పొందునట్టివై యున్నవి. ప్రభుత్వమువారును ఉదారులు కాబట్టి సాదరబుద్ధితో తమప్రియమైనట్టి భక్తిపూరితులైనట్టియు ప్రజలకుండు ఇబ్బందులను తొలగించెదరుగాక.

## ౯వ ఆంధ్రమహాసభ.

నల్లగొండ జిల్లాలోని చిలుకూరులో జరుగును

అధ్యక్షులు రావి నారాయణరెడ్డిగారు

మహాసభ తేదీలు ౧౭, ౧౮, ౧౯, తిరుసెల ౧౩౫౦ ఫ.

## ౯వ ఆంధ్ర మహిళాసభ.

పై తేదీలలోనే చిలుకూరులోనే జరుగును.

అధ్యక్షురాలు శ్రీమతి రంగమ్మగారు.

## ఇరాకులో భారతీయ సేన

౧౯౪౦ జూను ౩౦ వ తేదీన ఇరాకు ప్రభుత్వంతో బ్రిటిషు ప్రభుత్వంవారు కుదుర్చుకొనినసంధిపత్రముననుసరించి ఇరాకులో బ్రిటిషుసామ్రాజ్యసేనల రాకపోకల సౌకర్యాలను ఏర్పాటుచేయుటకై ఈ ఏప్రిలు ౧౫ వ ౧౮ వ తేదీలలో భారతీయసేనలు బాసార్హలో దించబడినవి. క్రొత్త ఇరాకు ప్రభుత్వమువారు ఈసేనలకు అన్ని సౌకర్యములను కలిగించుచున్నారు.

## కుమారి ఇందిరా నెహ్రూ రాక

పండిత జవహర్లాలుగారి కుమార్తెయగు ఇందిరానెహ్రూ దిక్షిణాఫ్రికాయుద్ధపు గండరగోళమధ్యనుండి తప్పించుకొని ఈదేశానికివచ్చి చేరినది. ఆమె ఏప్రిలు ౧౭వ తేదీన బొంబాయిరేవులో దిగినది. ఆమెరెండేండ్లక్రింద భారతదేశంనుండి వెళ్లిపోయి యుండెను. ౧౦ నెలలకుపైగా స్విజర్లండు చికిత్సాలయంలోనుండెను. యుద్ధప్రారంభమైనప్పుడును, ఫ్రాన్సు జర్మనులకు లొంగినప్పుడును ఆమెఅక్కడనేయుండెను. ఆమె అక్కడినుండి స్పెయినుపోర్చుగల్లుల మీదుగా ఇంగ్లాండు పోయి సంవత్సరప్రారంభమున బయలుదేరి ఆండనుకుపోయెను అక్కడినుండి ఇండియాకువచ్చెను. ఇంగ్లాండులో జనులు చాలాధైర్యముతోనున్నారని ఆమె చెప్పినది. ఆమెబొద్దిరోజులు బొంబాయిలోనుండి తర్వాత తనతండ్రిగారిని చూచుటకై అలహాబాదుకు పోగలదు.

## బోసుగారియిల్లు ౫ గంటలసేపు సోదా

కలకత్తాలో యెల్గిన్ రోడ్డులో సుభాష్ చంద్రబోసుగారి యింటిని పోలీసులు ఏప్రిలు ౨౦ వ తేదీన ౫ గంటలు సోదాచేసిరి. బోసుగారు నాగపూరులో ౧౯౪౦ జూను ౧౮ వ, ౧౯ వ తేదీలలో జరిగిన అఖిలభారత ఫార్వర్డుబ్లాకు రెండవ మహాసభలో ఇచ్చిన అధ్యక్షోపన్యాసము యొక్క ౨౦౦ ప్రతులను, మరికొన్ని పుస్తకములను, కరపత్రములను పోలీసులు పట్టుకొనిపోయిరి. బోసుగారి ఒక బంధువును పరీక్షించుటకై కలకత్తా పోలీసు ప్రధానకార్యాలయానికి తీసుకొనిపోయిరి. మరియొకరిని కలకత్తాలో ఒకభాగంలోమాత్రమే ఉండవలెనని ఆజ్ఞాపించిరి.

## స్పెయినును లొంగదీయుటకు జర్మనీపునఃప్రయత్నము?

గ్రీసుయుగోస్లేవియాలలో తానుపొందినవిజయములనుచూపి తనశక్తియెంతగొప్పదోవివరించి స్పెయిను దానుచెప్పినట్లునడవవలెనని, జర్మనీయి కహెచ్చరికలు ప్రారంభించునని జర్మనీనుండివచ్చినవార్తలవల్ల తెలియుచున్నది

## మెక్సికోలోని ఇటలీనావలలో యుద్ధ సామగ్రి

మెక్సికోనావ్సరువులలో మెక్సికో ప్రభుత్వమువారు పట్టుకొన్న ఇటాలియనావలలో యుద్ధసామగ్రికనబడెనని ఆనావలనువశపరచుకొన్న అధికారులుచెప్పిరి. ఏయుద్ధసామగ్రియెట్టిదో తెలియబడలేదు.

## ౭ శత్రునౌకలు ముంచివేయబడుట

మధ్యధరాసముద్రంలో బ్రిటిషు యుద్ధనావల సాహసకార్యము

ఒక బ్రిటిషుయుద్ధనావ మునిగిపోయింది

ఏప్రిలు ౧౬ వ తేదీ (మంగళవారం) రాత్రి సిసిలీనుండి ట్రిపోలీకి వెళ్ళుచుండిన ఐదుసరకు రవాణానావలు, వాటినిరక్షించుచుండిన మూడుడిస్ట్రాయర్లు శత్రునౌకాపక్షమును బ్రిటిషుయుద్ధనావలుముంచివేసినవి తాటుటూరీలు, అమితంగాపెక్కించుకొనియుండిన రెండునావలు ముంచబడినవి. మందుగుండుసామగ్రి తీసుకొనిపోవుచుండిన నావలో బ్రహ్మాండమైన ప్రేలుడుజరిగి, ఆనావబద్దలైపోయినది, తక్కినరెండునావలు కూడ ప్రేలిపోయినవి.

ఈనావలను రక్షించుచుండిన ఇటాలియనుడిస్ట్రాయర్లుకూడ ముంచివేయబడినవి.

ఈయుద్ధప్రక్రియలో బ్రిటిషుయుద్ధనావకు టార్పెడో తగిలి, అదిమునిగిపోయినది. అందులోనున్న వారిలో చాలామంది నావికసిబ్బందితో సహా, రక్షింపబడిరి.

## ఐర్లండులో బ్రిటనుకు నౌకాశ్రయములు

అమెరికావారడుగు నుద్దేశ్యము లేదు

వాషింగ్టను, ఏప్రిల్ ౧౮.

బ్రిటనుకు నౌకాశ్రయములొసంగవలెనని ఐర్లండునకొయనద్దేశ్యము అమెరికాప్రభుత్వమునకులేదని ఏప్రిలు ౧౮ వ తేదీన కార్డెల్ హల్లు గారునుడివిరి. ఇందువిషయమై వ్యాపించియుండినవదంతులు నిజముకావనియు, ఐర్లాండు అధికారులతో నిందువిషయమై చర్చలుగాని, రాయబారములుగాని జరిగియుండలేదనియువారుచెప్పిరి.

సంవత్సరమునకు చం గా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాకు
సంచిక ౧
నుండి విడిగా
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn** **Thursday 24th April 1941** *Number* **97**

## స్పెయినుకు సామ్రాజ్యాకాంక్ష

శాంతి అనే మాట ఉత్తది

## జనరల్ ఫ్రాంకో ఉపన్యాసము

ఏప్రిలు౧౯వ తేదిన స్పెయిను ముఖ్యపట్టణమగు మాడ్రిడునగరమునందు సైనికాధికారుల శిక్షణ కళాశాలను ప్రారంభించుచు స్పెయినుప్రభుత్వాధిపతియగు జనరల్ ఫ్రాంకో గారు యిట్లు చెప్పిరి.

స్పెయినులో విప్లవముముగిసి శాంతిఏర్పడినది. కాని, యీశాంతి మున్ముందు యుద్ధశిక్షణ నొసంగుటకొరకై అయియున్నది. ఈవిషయమును విస్మరించి విజయలాంఛనములను చూచుకొని మురియుచుండువారు దేశానికి ద్రోహముచేసిన వారగుదురు. జర్మనులయొక్క యుద్ధతంత్రములు అత్యద్భుతముగానున్నవి. జర్మను సైన్యము అద్వితీయమైన సైనికశిక్షణముగలదై యున్నది. అశ్విక దండయాత్రలు చాలా అమోఘమైనవి.

ప్రస్తుతకాలమందు సమరతంత్రము నూతన వికాసమునుపొంది చాలా వృద్ధిచెందియున్నది. ఆయిరోపా ఖండములోని యుద్ధరంగములందు సరియైన యుద్ధసాధనములు ప్రయోగింపబడుట వల్ల విజయపరంపరలు సాధింపబడుచున్నవి. కావి, పరాజితులైనవారు అనేకపొరపాటులను చేయుటవల్లనే ఓడిపోవుచున్నారు. స్పెయిను యుద్ధములో ఓడిపోయిన పక్షమువారుకూడ ఇట్టి యుద్ధతంత్రలోపమునే చేయుచుండిరి.

సైనిక కళాశాలాధ్యక్షులగు జనరలుఅవండా గారిట్లుచెప్పిరి– ఈసైనికశిక్షణకళాశాలలో ౧౭ మంది జనరలులున్ను ౫౭మందికల్నలులున్ను సైనికశిక్షణకు హాజరయ్యెదరు.

ఇతరులు స్పెయినురాజ్యమును ఏమార్గంలోనికిదింపవలెనని కోరెదరో ఆమార్గంలోనికి స్పెయినుదిగదు. యుద్ధముకావలెనని స్పెయిను కోరుట లేదు. స్పెయిను గౌరవస్థానము పొందవలెను. స్పెయినుకు చిరకాలసంప్రదాయసిద్ధముగాచెందవలసినది. స్పెయినుకు చెందవలెను. స్పెయినుయొక్క శౌర్యప్రతాపమున్న భూగోళమునందు స్పెయినుఎక్కడవున్నదో ఆభూభాగపరిస్థితినిబట్టి స్పెయినుకుచెందవలసినదేదో స్పెయినుకు చెందవలెను.

—

## బ్రిటనుపైజర్మనువిమానాల దాడులు

ఏప్రిలు ౧౭ వ తేదినుండి ౧౮వ తేదివరకురాత్రిలండనుపైజరిగినదాడి చాలనష్టకరమైనది– ఆదాడి జర్మనీప్రధాననగరమగు బర్లినుపైబ్రిటిషువిమానాలుచేసినదాడులకు ప్రతిక్రియయని జర్మనులుచెప్పినారు– ఈదాడిచే ౮ ఆస్పత్రులు, రెండువస్తుప్రదర్శనశాలలు, రెండుక్రైస్తవప్రార్థనాలయములు, ఒకపోలీసుఠాణా, ఒకగ్రామరుస్కూలు చానష్టపడినవి. ఈస్టుఆంగ్లియాప్రాంతంలో ఒకపట్టణమునందు చాలాయిండ్లుకూలి చాలామందిచచ్చిరి. ఈదాడులురాత్రిమధ్యవరకుసాగి కొంతసేపాగి, మరలతెల్లవారినతర్వాత కొంతసేపటివరకు కూడసాగినవి. పార్లమెంటు భవనాలపైకూడ బాంబులుపడిభగ్నమైనవి. రెండుజర్మనువిమానాలు ధ్వంసముచేయబడినవి– ఈరాత్రివిక్లెండుపై ఒకజర్మనువిమానము క్రిందకూల్చబడినది.

ఏప్రిలు ౧౭ వ తేదిరాత్రి బ్రిటనుపైకివచ్చిన జర్మనువిమానాలలోనుండి మూడుక్రిందకూల్చబడినవి–౧౯ వ తేదిరాత్రిప్రారంభంలో ఇంగ్లాండునైఋతిభాగంమీదను, ఉత్తరస్కాట్లెండుమీదను జర్మనువిమానాలుదాడిసలిపి కొంతనష్టం కలిగించెను–౧౭ తేదిరాత్రిదాడులలో లండనులోని కొన్నిఆస్పత్రులును క్రైస్తవప్రార్థనమందిరములును పాడైనవి–

—

## బ్రిటిషు స్టీమరు ముంచబడుట

ఒకబ్రిటిషుస్టీమరు శత్రువుల చేటార్పిడోచేయబడగా చావగా మిగిలిన౧౯ మందిని ఒకఫ్రెంచిలునావ ఎక్కించుకొనివచ్చుటకై వచ్చెను.

శత్రువులచే నాక్రమింపబడిన ఫ్రాంసుదేశమునకు వెళ్లుచున్న నూనెనావను బ్రిటిషుజలాంతర్గామి 'స్ట్రైగన్' ముంచివేసెను. దీనినిండనూనెయుండెను. ఈనావలోఫిరంగులుగూడ నుండెను.

—

## జపానువారి క్రొత్తదాడి

**చైనా సముద్రతీరపురేవుల ఆక్రమణ**

ఇంతవరకుజపానువారు చైనాకు బయటదేశాలనుండి యుద్ధసామగ్రిగాని, ఆహారసామగ్రిగాని పోకుండాచేసిన దిగ్బంధనలో చైనా సముద్రతీరమందలి కొన్నిరేవులు తప్పించుకొనియుండెను–వాటిఆక్రమణకై జపానుసేనలిప్పుడుఉద్యమించినవి. జపానుసేనలు యుద్ధనౌకల సహాయంతోను, విమానాలసహాయంతోను ఏప్రిలు ౧౯వతేదిన నింగ్పోఅను రేవువద్దదిగినవి. తర్వాతఆసేనలు నింగ్పోనుండి రెంచౌరేవును ఆక్రమించినవి– నింగ్పోకు ౧౦౦మైళ్లదక్షిణములోనుండే హైమన్ రేవును, హాంగ్కాంగ్కు ౩౦మైళ్ళ దక్షిణంలోనుండే మాకౌరేవునుకూడ తరువాత జపానుసేనలు ఆక్రమించినవి.

తర్వాత జపానుసేనలు ఫ్యూకియన్ రాష్ట్రంలో మిన్ నది ఉత్తరతీరంలో రెండుచోట్లలో చేరినవి–అక్కడినుండి ఫూచౌరేవును ఆక్రమింపజూచుచున్నవి–ఇవి ఆక్రమించబడినచో చైనా సముద్రతీరపురేవులను ముఖ్యమైనవాటి నన్నిటిని ఆక్రమించుపని పూర్తియగును–తర్వాత జపానుసేనలు చైనాలోకి నైఋతిదిశవైపుపోయెదరు–

ఏప్రిలు౧౮వతేదిన మధ్యాహ్నము జపాను విమానాలు మెకాంగునది ఎగువప్రాంతముపై ఎగిరి కుంగ్కోవద్ద వంతెనపై బాంబులనువేసినవి. ఈవంతెన తెగగొట్టబడినందువల్ల బర్మారోడ్డు విచ్ఛేదమై బర్మామీదుగా చైనాకుపాద్యోసామగ్రి సరిగా చైనాకు చేరకుండాపోవును.

**వదంతుల ఖండన**

బ్రిటను, అమెరికా చైనా, ఆస్ట్రేలియా, ఇండియా. ఈస్టిండీసురాజ్యాలు నౌకాదళమును గురించి జపానుకువిరోధమైన ఒక ఒడంబడికను చేసికొనసున్నవని జపానులో ఒకవదంతి లేవదీసినారు–ఇది జపానుప్రజలకు పైదేశాలపై ద్వేషము కలిగించుటకు చేసిన తుచ్ఛప్రచారము మాత్రమే యనియు, నిజంగా అట్టిరహస్యమైన ఒడంబడిక ఏదిగాని జపానుతో చేసికొనబడుచుండుట లేదనియు ఆస్ట్రేలియాప్రభుత్వ విదేశాంగమంత్రియగు సర్ ఫ్రెడరిక్ స్టీవర్టుగారు ఏప్రిలు౧౯వతేదిన చెప్పినారు–

**ఇండోచైనా థాయిలాండుల సంఘర్షణ**

థాయిలాండువారి ప్రదేశంలోకి కొన్నిఫ్రెంచిసేనలుదూరెనను వదంతిపై థాయిలాండుసరిహద్దువద్ద థాయిలాండువారిసేనలకును, ఇండోచైనావారిసేనలకును సంఘర్షణలుజరిగినట్లు ఏప్రిలు౧౭వతేదినాటివార్తలో నున్నది–

—

## బ్రిటను ఓడుచో అమెరికాకు ఉపద్రవము

**అమెరికా నౌకాశాఖ కార్యదర్శిప్రకటన**

"ఈయుద్ధములో అటోయిటో తేలవలసినస్థితి వచ్చినది, క్రమక్రమముగా నాదేశముశత్రువులచే చుట్టుముట్టబడుచున్నట్లు నాకుకనబడుచున్నది.ఈయుద్ధములో పాల్గొనుచున్న బ్రిటనుమున్నగువారికి అపజయముకలుగుచో మనదేశమునందల, మన సంస్థలయందల అభిమానములేనివారిచే ఈదేశము చుట్టుముట్టబడును, అని ఏప్రిలు౧౭వ తేదిన ప్రజాప్రతినిధికమిటీయెదుట సాక్ష్యమిచ్చుచు నౌకాశాఖకార్యదర్శి కర్నల్ ఫ్రాంకునాక్సుగారు ప్రకటించిరి.

—

## అమెరికా వ్యాపార నౌకలు

**సాయుధ రక్షణ యొసంగబడును**

యుద్ధప్రాంతములలో ప్రవేశించనంతకాలము, అమెరికానావ లెన్నటికివెళ్లినన్నటికి సాయుధరక్షణముపంపబడును. అని ఏప్రిలు౧౭వ తేదిన పత్రికాప్రతినిధులసభలో రూజువెల్టుగారు ప్రకటించిరి.

ఎఱ్ఱసముద్రమునకువెళ్లు ఓడలుగూడ ఈవిధముగానే రక్షింపబడునాయని యడుగగా ఆయన బదులుచెప్ప నిరాకరించెను ఎఱ్ఱసముద్రంలోయిప్పుడు అమెరికావారినావలు లేవని ఆయనచెప్పెను. అమెరికావారి సరుకునావలకుఫిరంగులమర్చెదరాయని యడుగగా ఉపన్యాసకుడుతప్ప తదితరులు దానివిషయమై విచారించియుండలేదని ఆయన చెప్పెను.

—

## ఇటలీయుద్ధవ్యయము

౧౯౩౫ సంవత్సరమునుండి యిప్పటివరకుఇటలీ యుద్ధఖర్చు ౧౬,౫౦౦౦లక్షల లైరులు. అబిసీనియా యుద్ధఖర్చు, స్పెయినుయుద్ధఖర్చు దీనిలోచేరి యున్నది. ఈకాలములో ఇటలీ ఆదాయము ౩౧,౦౦౦౦ లక్షలలైరులుమాత్రమే. లోటు ప్రభుత్వబాండ్లు విధబ్యాంకుల కరెంటు అకౌంట్లు. ఇటలీబ్యాంకు అడ్వాన్సులవల్ల తీర్చబడెను.



Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor- S Prathapa Reddy B. A B.L.